చున్నది ప్రజల నాకర్షించు శక్తి వారిలో గానవచ్చుటలేదు.

ఈ మధ్య నొక మహారాష్ట్రీయుడు నేను యీ ప్రభవ సంవత్సర ఆంధ్ర పుగాది సంచికలోని చిత్రపటముల జూచుచుండగా దానిలోని 112 వ పేజీలో శ్రీ శంకర స్వాములవారి చిత్రపటమును గాంచి ఆంధ్రము తెలియనివాడు గావున లక్ష్మీదేవి విగ్రహమని దలంచుటయు, శంకరస్వాములవారిదని నేననగా నేను హాస్యము జేయుచున్నానని నన్ను నమ్మకపోవుటయు, పాఠకుల కాశ్చర్యముగలుగకపోదు చిత్రపటములోని శంకర స్వాములవారికి తలపై కిరీటముండుటయు మూతిపై మీసములు లేకపోవుటయు, గుండ్రని ముఖమును గలిగి కంఠమునను చేతులకున్ను యొక మార్వాడీ సాహుకారి భార్యకువలెనే యనేక స్వర్ణభూషణములుండుటయు, గాంచి ఆంధ్రభాషా జ్ఞాన రహితుడగుటచే లక్ష్మీదేవి విగ్రహమని నా మహారాష్ట్ర స్నేహితుడు భావించుటలో నాశ్చర్యమేమి? ఇవియేనా? స్వాములవారికుండవలసిన లక్షణములు. ఇవియేనా! సనాతనాచార సన్యాసాశ్రమ విధులు ఈ విధముగనేనా? ఆదిశంకరాదులు నడిచినది వీరి సన్యాసము శ్రీ శంకరులవారిననుసరించి కర్మ సన్యాసమో! లేక లోకమాన్యు ననుసరించి కర్మఫల సన్యాసమో? తెలియుటలేదు. వీరు యీ యాశ్రమమును స్వీకరించిన దెందులకో? వీరు పరిత్యజించినదేమిటో? తెలియవచ్చుటలేదు ఈ యాశ్రమమును స్వీకరించుటచే యింతకుముందటి కంటెను భూషణములేమి? పంచభక్ష్యపరమాన్నము లేమి? విలువ గల జరీశాలువలేమి? కిరీటాదులేమి? శిష్యులు తప్పురాండ్రేమి? పాదపూజలేమి? యభివృద్ధియగుచునే యున్నవి వీరినేనా? హిందూ మతస్థు లెల్లరును ఆదర్శప్రాయులుగా నంగీకరించవలసినది వీరిని జూచియేనా సనాతన ధర్మమును గ్రహించవలసినది ఆశ్చర్యము! అతివిచిత్రము! ప్రకృతి స్వభావము! ప్రపంచ లక్షణము!

---

## కొడంగల్

(స్వకీయ విలేఖరి)

### కాలస్థితి

సుమారు ౨౦ రోజులనుండి వర్షములేమ వరిపంటకు తగిన నీరురాక పోయినను పునాస పంటకు సరిపోవు నట్లైనను వర్షము కురిసిన బాగుండునని కర్షకులు తలంచుచున్నారు

### మార్పు

ఈయూరి మాధ్యమిక పాఠశాలలో సుమారు ౫-౬ సంవత్సరముల నుండి సహాయోపాధ్యాయులుగనున్న శ్రీ ఉన్నవ పానకాల రావుగారు బళ్లారి యూరులోచేరిన అలంపూరు స్కూలునకు మార్చబడిరి. వీరి యీమార్పువలన గ్రామవాసుల కందరికి ముఖ్యముగ హిందూజనుల కందరికి ఖేదము కలిగినది. వీరు రాజమండ్రి వాస్తవ్యులు మంచి ఉత్సాహవంతులగు యువ్వనులు విద్యావంతులు పరోపకారము నందును, ప్రజాహిత కార్యములందును వీరి కభిమానము మెండు. నేతవాండ్లు పగలంతయు తమవృత్తి పనులొనర్చుకొను వారలగుటచే ప్రభుత్వ పాఠశాలకు రాజాలరని తలచి వీరివిద్యాభ్యాసము కొరకు 'మొగలప్ప' అనువారిచే ఒక రాత్రి పాఠశాలను స్థాపింపచేసి వారికి అన్ని విధముల సహాయము చేయుచుండిరి. ఈ పాఠశాల స్థిరముగ నుండగలుగుటకు సర్కారి గ్రాంటు నిప్పించుటకు కూడ ప్రయత్నము చేసిరి. ఇక కొద్ది కాలము గడచిన గ్రాంటు కూడ దొరకు చుండును. పంచముల విద్యాభ్యాసము కొరకు గూడ నొక పాఠశాలను పెట్టించ ప్రయత్నించు చుండిరి. ఈ యూరి విద్యార్థులయందు ఆంగ్లవిద్యాభిమానము దృఢముగ నెలకొల్పి, విద్యాభ్యాసము కొరకు బలమైన కృషిసల్పిన వారిలో వీరు ముఖ్యులు, వీరికృషిఫలితముగ చాల విద్యార్థులు ఆంగ్ల భాష మాధ్యమిక పరీక్షయందు ఉత్తీర్ణులైరి. ముఖ్యముగ వీరివలన హిందువులందు ఒక నూతనోత్సాహము కలిగియుండెను

---

## సూచన

శ్రీకృష్ణ జయంతి వలన నేడు (౮) పేజీల పత్రిక ప్రకటింపబడినది.

గో. ప. సం.

గోలకొండ పత్రిక

ప్రభవ సంవత్సర శ్రావణ బ॥ ౨

శుక్రవారము

## మత విషయమున ద్వంద్వాచరణ

మనుజుడు తన వ్యక్తిత్వ ధర్మములను నిర్వహించుటకు మతము మనుసది మార్గదర్శకము. ఈ ఆదర్శమును అనుసరించి అతడు మెలంగుచుండును. ఈ ఆదర్శమును తన జీవితము యొక్క పరమావధిగ జేసికొనుట మనుజుని అంతరాత్మ నిర్ణయించియుండును. ఒకనొక ఆదర్శము స్వీకరించిన పిదప దాని విసర్జించి వేరొక మార్గమవలంబించుమని యాతని ప్రోత్సహించుటకు గాని ఉత్సాహము వ్యక్తులకే గాని, సంఘమునకే గాని, ఈ నాగరిక యుగమున అసాధ్యము. అందువలన కాల ప్రవాహముచే జన్మతః ఒక ఆదర్శము నందున్నవారు పరవ వేరొక ఆదర్శము స్వీకరించి జరుగుటకై ప్రయత్నించుచున్నారు.

ఇటీవల పెద్దపల్లి దేశముఖులును, హిందూ సంఘమునందు బ్రాహ్మణేతర జాతికి జెందిన వారును, అగు వేంకట రాజేశ్వరరావుగారు కీర్తిశేషులయిన సంగతి పాఠక ప్రపంచమునకు విదితమే. వారికి కొన్ని సంవత్సరముల క్రింద ఇస్లాము మతముపై శ్రద్ధ గలిగినట్లును, బహిరంగముగ హిందూ ధర్మములకు లోబడినట్లును, చెప్పుచున్నారు. వారి అంత్య సంస్కారములు ఇస్లాము మతానుసారము జరుపుటచే ఈ విషయమున కలవరము కలిగినది. తాము ప్రేమించునది బహిరంగముగ స్వీకరించక ద్వంద్వాచరణచే ఉభయ మతములను నిందాస్పదము జేయుట అసమంజసమని హిందూ సంఘము వారు తలంచుచున్నారు. హిందూసమాజము వారిట్టి పద్ధతి అవలంబించు టేలయని ప్రశ్నించుచున్నారు.

పోయినవారు పోగ వారసులు స్వగ్రామమున హిందూ మత సాంప్రదాయ ప్రకారము సంస్కారములు సలుపుటయు, ముసల్మాను సోదరులు తమ మత సాంప్రదాయానుసారము ప్రార్థన సభలు జరుపుటయు, హిందూ సమాజమును వారిని విస్మయమున ముంచుటయే గాక వీరి వారసులు యేమతమునకు జెందినవారని సందేహము కలిగించినది. సమాజికుల యందెంతో అలజడి కూడ కలిగించినది.

ఈ విషయమై సమాలోచించుటకు నిన్న వివేకవర్ధనీ థియేటరునందు హిందూ సమాజికుల బహిరంగ సభ శ్రీయుత రామచంద్ర నాయకు ఎం. ఏ. బార్ఎట్లా గారి యాజమాన్యమున జరిగినది. సభయందుపపాదింపబడి ఆమోదింపబడిన తీర్మానములు సమంజసముగనే యున్నవి. ప్రస్తుత పరిస్థితులను గూర్చి విచారము వెలిపి ధర్మశాస్త్ర ప్రకారము హిందూసంఘ రక్షణార్థము అవసరములగు చర్యలను అవలంబింపవలయునని పీఠాధిపతులను మొకటి తీర్మానము కోరుచున్నది. మతమునందిట్టి అంతరాయములు కలుగుచున్నప్పుడు పీఠాధిపతులు తమ అమూల్యాభిప్రాయములు తెలిపి సంఘమును కాపాడవారి విధియై యున్నది. ఇట్లు శాసింపకుండిన సంఘము నందవినీతి ప్రబలుచుండునని విదితమే.

ప్రభుస్వామ్యము ప్రజలు ధర్మదూరులు గాకుండ కాపాడుచుండును. పాలితుల వివిధ మతములయందు శ్రద్ధ వహించి శాసించుచుండును. ఈ రాష్ట్రమున వివిధ మతముల వారు నివసించుట చేత దయామయులగు ప్రభుత్వము వారు దృష్టి చూపి యున్నారు. ౧౩౩౭ ఫ॥ సంవత్సరమున వెడలిన గష్తీ ద్వారా ప్రభుత్వమువారు క్రొత్త మతము స్వీకరించిన మృతుని అంత్య సంస్కారముల విషయములో పొరపాటులు జరుగుటకు అవకాశము కలదని సూచించుచు మతమును మార్చుకొన్న విషయము స్పష్టముగ ప్రకటితమై రిజిస్టరులో చేర్చవలెనని సూచించి యున్నారు. ఇట్టి విషయమే యిప్పుడు జరుగుట చేతను, కీ. శే. దేశముఖుగారు చనిపోకముందు తాము మహమ్మదీయులైన సంగతి ప్రకటించక పోవుటచేతను, సభవారు ప్రభుత్వమును ఈ విషయమున శ్రద్ధ వహించుటకై కోరిరి.

ఇందువలన మా మహమ్మదీయ సోదరులు వేరొక భావము తలంచకుందురుగాక యని మేము సూచించుచున్నాము. ఈ రాష్ట్రము చిరకాలమునుండి హిందూ మహమ్మదీయ మైత్రికాలవాలమై, ఇతర ప్రాంతములకాదర్శ ప్రాయమై వచ్చుచున్నది. ఇట్టి శాంతతకు కళంకము కలిగించిన ఇరు సంఘములవారును బాధ్యులుగానే పరిగణింపబడుదురు. హిందువులు కీర్తిశేషులును, వారి వారసులును యేమతమునకు జెందిన వారని తెలిసికొనుటకును, ద్వంద్వాచరణచే ఉభయ మతముల నగౌరవ పరచకుండుటకును వాంఛించుచున్నారు. శాంతి, ప్రేమ, మూలమున అన్నియు పరిష్కరింపబడును. ఈ విషయమై కీర్తిశేషుల వారసులు స్వయముగా తమ అంతరాత్మ ప్రేరణమును ప్రకటించి కృతజ్ఞతా పాత్రులగుదురని నమ్మెదము.

---

## శైవ సభలు

### ద్వితీయ శైవపండిత మహాసభ

ఈసభ శ్రావణ శు॥ ౩ ఆదివారముదయమున రాజా కందుకూరి బాలసూర్య ప్రసాదరావుగారి అధ్యక్షత క్రింద ఆకారపు వెంకన్న చెన్నయ్య గార్ల జాయింట్ గిర్నియందు సమావేశమయినది. మద్ది సోమయ్య గారిచే స్వాగతోపన్యాసము చదువబడెను. బ్ర॥ ముదిగొండ కుమారస్వామి గారు ప్రజారంజకమగు స్వాగత పద్యములు చదివిన పిదప, అధ్యక్షులు చెన్నకొనబడి తమ ప్రారంభోపన్యాసమును చదివిరి. మధ్యాహ్న మధ్యక్షులును, బ్ర॥ శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి గారును, ముదిగొండ బుచ్చయ్య లింగశాస్త్రి గారును, మరిమూలను గూర్చియు, బ్ర॥ శ్రీ పులిపాక మహాదేవశాస్త్రిగారు, శైవసిద్ధాంతమును గూర్చియు నుపన్యసించిరి. శ్రావణ శు॥ ౫, ౬ తేదీలయందు పండితులు మత విషయములను గూర్చి చర్చించిరి.

### ౧౫వ శైవ మహాసభ

ఈ శైవసభ శ్రావణ శు॥ ౬ బుధవారముదయము పండిత సభా భవనమునందే రాజా కందుకూరి బాలసూర్య ప్రసాదరావుగారి యధ్యక్షత క్రింద సమావేశమయినది. మద్దిసోమయ్య గారిచే స్వాగతోపన్యాసము చదువబడినది. అధ్యక్షుల ఎన్నిక జరిగిన పిదప నధ్యక్షులు అగ్రాసనాసీనులై ప్రారంభోపన్యాసమును జదివిరి. శైవ మతమును గూర్చియు నుపన్యాసములు జరిగినవి, మధ్యాహ్నము దేశోద్ధారకులగు శైవ సంఘము వారు వినతిపత్రము సమర్పించిరి. శ్రీ ములుగు రామలింగయ్యగారు ౧౯౨౦ శైవ మహాజనసభా చారిత్రములు జదివిరి. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు శైవమత మేయే మార్గముల వృద్ధిపొందినది యను విషయమై శైలిలో నుపన్యసించిరి. శ్రీ ముదిగొండ బుచ్చయ్య లింగశాస్త్రిగారు శైవమత గౌరవమును వెల్లడించిరి.

### ద్వితీయ దినచర్య

ఉదయము మత విషయము చర్చించి తీర్మానింపబడినవి. మధ్యాహ్నము శివాధిక్యతను గురించియు, వేదవిద్యను గూర్చియు, భాష్యము గూర్చియు, జీవేశ్వరైక్యమును గూర్చియు, సజ్జన భాషణముల గూర్చియు శివభక్తిని గూర్చియు యుపన్యాసములు జరిగినవి.

